# పీఠిక

ఈశతకము సార్వజనీనపుస్తకభాండాగారమునఁ జిరకాలమునుండియున్నట్లు నే నెఱుఁగుదును. ఇది శ్రీమద్భాగవతమును దెనిఁగించిన బమ్మెర పోతనామాత్యకృతమని గద్యవలనఁ దెలియుచున్నది. గ్రంథశైలియందును, కొన్ని వ్యాకరణదోషములయందును భాగవతమునకు సంపూర్ణమగు పోలికతో నున్నది. ఈశతకమునకుఁ బెద్దాపురమునుండి యొక తాళపత్రగ్రంథమును, మరియొక చోటనుండి కాగితపుఁబ్రతియు, రాజమహేంద్రవరమునారు సంపాదించిరి. ఒకప్రతి నీపత్తువారు సంపాదించిరట్లు వినుదును. ప్రస్తుతము నేనీభక్తాగ్రేసరుని యెడనుండు భక్తిచే రాజమహేంద్రవరపుఁ బ్రతిననుసరించియే దీనిఁ దొందరగా నొక్కదినములో ముద్రించితిని. దేహారోగ్యముసరిగ లేకున్నను గ్రంథపరిశీలనమునం దుత్సాహముతో నాకుఁ దోడ్పడిసాయమొనరించిన శ్రీయుత వడ్డాది సుబ్బారాయకవివర్యులకుఁ గృతజ్ఞుఁడను. ఈగ్రంథమును పోతన్న చిన్నతనమునందు మంచిధారగల కవితాశక్తి గలిగి శ్రుతపాండిత్యముచే రచియించి, క్రమముగా మహాపండితుఁడై భాగవతము రచియించినట్లు నమ్మవచ్చును. కావున నాతని సహజపాండిత్యాభిరుదమునకిది తార్కాణము కావచ్చునని నాయభి

ప్రాయము. పద్యములనడక, భావములు, నతిరమ్యములయ్యు భాషాదోషములెల్లవిధములైనవి నిందుఁగన్పట్టుచున్నవి.

వివరమగు పీఠికయు, గ్రంథవిమర్శనమును పాఠభేదములును రెండవముద్రణమునఁ జేర్పఁబ్రయత్నించెదను. ఈగ్రంథము ముద్రించుకొనుటకిచ్చిన సార్వజనిక పుస్తకాలయము వారికి నాకృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. ఇదియొక్క-దినములో ముద్రింపించిన ముద్రాలయాధికారులకు నావందనములు.

కాగితపుకఱవుచే నతిస్వల్పముగ నీశతకమును ముద్రించినందునఁ గొంచె మధికమూల్యము నిర్ణయింపవలసివచ్చినందులకు మహాశయుల మన్నింపఁ గోరెదను.

వ్రాఁతప్రతులలోనొకటి సార్వజనిక పుస్తకభాండాగారమునకు వేము నరసయ్యగారిచే నొసంగఁబడినది.

ప్రాయికముగా యథామాతృకముగా ముద్రింపఁబడినది.

ఇట్లు

పిఠాపురము.
5—4—19.

వంగూరి సుబ్బారావు.
ఆంధ్రపరిశోధకమహామండలి.

# నారాయణశతకము

శా. శ్రీరామామణిపాణిపంకజ మృదుశ్రీతజ్ఞపాదాబ్జ! శ్యాం
గారాకారశరీర చారుకరుణాగంభీర సద్భక్తమం
దారాంభోరుహపత్రలోచన కళాధారోరుసంపత్సుధా
పారావారవిహార! నాదురితముల్ ఖండింపు నారాయణా. ౧

మ. కడకుం బాయక వేయినోళ్ళు గలయా కాకోదరాధీశుఁడుం
గడముట్ట న్వినుతింపలేక నిగుడన్ గాత్రిలంగ నొప్పారు మి
మ్మడరన్ సన్నుతిసేయ నాదువశమే యజ్ఞాని లోభాత్ముఁడన్
జడుఁడ న్మూర్ఖుఁడ నైకజిహ్వుఁడ జనస్తబ్ధుండ నారాయణా. ౨

శా. నే నీదాసుఁడ నీవు నాపతివి నిన్నేకాని యొం డెవ్వరిన్
ధ్యానింపం బ్రణుతింప నట్లగుటకు న్నానేర్చు చందంబునన్
నీనామస్తుతు లాచరించు నెడల న్నేతప్పులుం గల్గినన్
వానిన్ లోఁగొనుమయ్య తండ్రి! విహితవ్యాపార నారాయణా. ౩

మ. నెరయ న్నిర్మల మైన నీస్తుతి కథానీకంబు పద్యంబులో
నొరుగుల్ మిక్కిలి గల్గె నేనియుఁ గడు న్యోగ్యంబె చర్చింపఁగా
చెఱకుంబైనను వంకబోయినఁ గడుం జుజ్జయినఁ జేదొత్తునం
జెఱుకుంగోలకు తీపు గాక కలదే చేఁ దెందు నా॥ ౪

మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి విపులం జాలఁగ సుజ్ఞాని నై
మదిలోఁ బాయక నిన్ను నిల్పఁదగు నామర్మంబు వీక్షింపఁడే
మొదలంగాడిన చారుగంధవితతుల్ మోవంగ శక్యంబె కా
కది సౌరభ్యపరీక్ష జూడ కుశలేయవ్యక్త నా॥ ౫

సమకించెన్ భువనత్రయంబును గిరుల్ దంతావళుల్ సుస్థిరం
గమనం బై ధరియించి మించినజగత్కల్యాణ నా॥ ౧౨

శా. భీమాకారవరాహ మై భువనముల్ భీతిల్లి కంపింప ను
ద్దామోర్వింగొనిపోయి నీరనిధిలోఁ దాగున్న గర్వాంధునిన్
హేమాక్షాసురు వీఁక దాకి జయలక్ష్మిన్ గారవింపంగ నా
భూమిం దక్షిణదంష్ట్ర నెత్తిన నినుం బూజింతు నా॥ ౧౩

శా. స్తంభంబందు నృసింహ మై వెడలి యచ్చండాట్టహాసధ్వనుల్
దంభోళిం గడువంగ హేమకశిపోద్దండాసురాధీశ్వరుం
శుంభద్గర్భము వ్రచ్చి వానిసుతునిన్ శోభిల్ల మన్నించి య
జ్జంభారాతిని ప్రీతిఁ జేర్చిన నినుం జర్చింతు నా॥ ౧౪

మ. మహిం ద్యో న్నాకసముం బదత్రయపరీమాణంబుగాఁ బట్టి యా
గ్రహ మొప్పం బలిమస్తకం బొకపదగ్రస్తంబు గావించి యున్
విహరించింద్ర విరించి శంకరముఖావిర్భూతదివ్యాకృతిన్
సహజం బై విలసిల్లు వామనలసత్కల్యాణ నా॥ ౧౫

మ. ధరణిన్ రక్తమహాహ్రదంబు లెలమిం ద్రైలోక్యాద్భుతమై
పరగం బైతృకతర్పణంబుకొఱకై బహ్వాకృతిగాఁ దీవ్రతన్
నిరువయ్యొక్కటిమారు క్షత్రియకుల శ్రేష్ఠాళి నిర్జించి త
త్పరశుభ్రాజితరామనామ మొనరన్ భావింతు నా॥ ౧౬

మ. పరుసం దాటకిఁ జంపి కౌశికు మఖుస్వాస్థ్యంబుగాఁ జేసి శం
కరుచాపం బొగిఁ ద్రుంచి జానకిఁ దగం గళ్యాణమై యొండ్రపం
పరదారన్ వనభూమి కేగి జగదాహ్లాదంబుగా రావణుం
ధరణిం గూల్చిన రామనామమున్ కడు ధన్యంబు నారాయణా. ౧౭

మ. యదువంశంబునఁ గృష్ణ కన్నజుఁడ వై యాఖిల శౌర్యోన్నతిన్
మదవద్ధేనుక దానవాద్యసురులన్ మర్దించి లీలారసా
స్పదకేళీరతి రేవతీవదనకంజాతాంత భృంగంబనన్
విదితంబౌ బలరామమూర్తివని నిన్ వీక్షింతు నారాయణా. ౧౮

మ. పురముల్మూఁడును మూఁడులోకములు నేర్పొద్దున్విదారింపఁ ద
త్పురనారీ మహిమోన్నతుల్ చెడుటకై బుద్ధుండవై బుద్ధితో
వరుసం దద్రిమ సేవఁజేయుటకునై వారిం బ్రబోధించి య
ప్పురముల్ గెల్చిన మీయుపాయము జగత్పూజ్యంబు నారా॥ ౧౯

మ. కలిధర్మంబున బాపఁ సంకలితులై గర్వాంధులై తుచ్ఛులై
కులశీలంబులు మాని హేయగతులం గ్రొవ్వారు దుష్టాత్ములం
బలిగాఁ జేయఁదలంచి ధర్మమెలమిం బాటించి నిల్పంగ నిం
పలరంగల్క్యవతార మొందఁగల నిన్ భావింతు నారా॥ ౨౦

మ. ఇరవొందం సచరాచరప్రతతుల న్నెన్నంగ శక్యంబె కా
కరయన్ పద్మభవాండభాండచయమున్నారంగ మీకుక్షిలోఁ
నరుదారన్నదయింపఁ బెంప నడపన్నన్నారి కేళోద్భవాంతరవాః
పూరము చందమొందఁ జెప్పుసుం దైత్యారి నారా॥ ౨౧

మ. దళదిందీవర నీలనీరద సముద్యద్భాసితాకార శ్రీ
లలనా కౌస్తుభచారువక్ష విబుధశ్లాఘోద్భవ స్థాన కో
మలనాభీ చరణారవింద జనితామ్నాయాద్య గంగా! లస
జ్జలజాతాయతనేత్ర నిన్ను మదిలోఁ జర్చింతు నారా॥ ౨౨

మ. జగదాధారక భక్తవత్సల కృపా జన్మాలయాపాంగ! భూ
గగ నార్కేందుజలాత్మ పావక మరుద్గాత్ర! ప్రదీప ప్ర
యోగిగణస్తుత్య మహాఘనాశన! లసద్గీర్వాణసంసేవితా!
త్రిగుణాకార! ముకుంద! నాదుమదిలో దీపింపు నారా॥ ౨౩

మ. భూతవ్రాతము నంబుజాసనుఁడవై పుట్టింతు విష్ణుండవై
ప్రీతింబ్రోతు హరుండవై చెఱుతు నిర్భేద్యుండవై త్రైగుణో
పేతంబై పరమాత్మవై నిలుతు నీ పెంపెవ్వరుం గానర
జ్ఞాతోద్భూత సుజాత పూజిత పదాబ్జశ్రేష్ఠ నారా॥ ౨౪

మ. వరనాభీ ధవళాంబుజోదరమునన్ వాణీశుఁగల్పించి య
ప్పరమేష్ఠిని ఫాలమందు శివునిం బుట్టించి యామేటికిం

బరమోత్తంసముగా వియత్తలనదిం బాదంబులంగన్న మీ
సరి యెవ్వారలు మీకుపక్కఁగ రమాసాధ్వీశ నారా॥ ౨౫

మ. పరిభమీనాభి జనించిన లసత్పద్మోరుసద్మంబునం
బరిభవంబైన విరించి ప్రాంజనితపరిస్వేద సంభూతుఁడై
యభిధానంబును గోరి కాంచెను భవుండార్యేశు లూహింపఁగా
నభవాఖ్యుండవు నిన్నెఱుంగవశమే యబ్జాక్ష నారా॥ ౨౬

మ. పటుగర్భాంతరగోళభాగమున నీబ్రహ్మాండభాండంబు పా
కట దివ్యాద్భుతలీలఁ దాల్చిజనితా కల్పాంతమంభోధిపై
వటపత్రాగ్రముఁజెంది యొప్పిన మిమున్వర్ణింపఁగా శక్యమే
నిటలాక్షాంబురుహాసనాదికులకు న్నిర్వాణ నారా॥ ౨౭

మ. సవిశేషోరు సువర్ణబిందుల సచ్చక్రాంక లింగాకృతిన్
భవుచే నుద్ధవుచే పయోజభవుచే పద్మారిచే భానుచే
దివిజేంద్రాది దిశాధినాయకులచే దివ్యమ్మునీంద్రాళిచే
నవదివ్యార్చన లందుమందువు రమానాథేశ నారా॥ ౨౮

మ. సర్వంబున్ వసియించు నీతనువునన్ సర్వంబునందుం దగన్
సర్వాత్మా వసియింతు దీవనిమదిన్ సార్థంబుగాఁజూచి యా
గీర్వాణాములు వాసుదేవుఁడనుచున్ గీర్తింతురేపార్దు నా
శీర్వాదంబు భవన్మహామహిమ లక్ష్మీనాథ నారా॥ ౨౯

మ గగనాద్యంచిత పంచతత్వమయమై కంజాత జాండావళిన్
సగుణబ్రహ్మమయాభ్యతం వనయచున్ సంసారివై చిత్కళా
సుగుణంబై విలసిల్లుదీవు నిరతస్థూలంబు సూక్ష్మంబునై
నిగమోత్తంస జయాదిహంసవిగుణా నిత్యాత్మ నారా॥ ౩౦

మ. ఎలరారంభపదీయ నామపఠనం బేమర్త్యు చిత్తంబులో
బొలుపారందగిలుండు నేని యసువుల్ పోందంగ నెట్లో పెనున్
కలయంబావను చేతఁబట్టు వను నక్కాలప్టంబుల్తైఁ గీటముల్
నిలువన్నేర్చునె భక్తపోషణ కృపానిత్యాత్మ నారా॥ ౩౧

మ. కలయందిక్కులు నిండి చండతరమై కప్పారు మేఘౌఘముల్
వెలయన్ ఘోరసమీరణస్ఫురణచే వేపారు చందంబునన్
జలదంభోళి మృగాగ్ని తస్కరభుజా శత్రోరగవ్రాతముల్
దొలఁగన్మీరగు దివ్యమంత్రపఠనన్ దోషఘ్న నారా॥ ౩౨

మ. కలుషాగాధవినాశకారియగుచుం గైవల్యసంధాయియై
వలనొప్పారెడు మంత్రరాజమగు నీనామంబు ప్రేమంబుతో
నలరన్నెవ్వని వాక్కునంబొరయదే నన్నీచు ఘోరాత్ముఁడుం
వెలయంభూరుహకోటరంబదియ సూ వేదాత్మ నారా॥ ౩౩

మ. పరమంబై పరతత్త్వమై సకలసంపత్సారమై భవ్యమై
సురసిద్ధోరగయక్షపక్షిముని రక్షోహృద్గుహాంతస్స్ఫుర
ద్వరసుజ్ఞానసుదీపమై శ్రుతికళావ్యాపారమై సిద్ధమై
సరిలేకెప్పుడు నీదునామ మమరున్ సత్యంబు నారా॥ ౩౪

మ. అధికాఘౌఘతమోదివాకరమునై యద్రీంద్రజాజిహ్వకున్
సుఖమై వేదవినూత్నరత్నములకున్ సూత్రాభిధానంబునై
బుధసందోహమనోహరాంబరమునై భూదేవతాకోటికిన్
విధులై మీబహునామరాజి వెలయున్ వేదాత్మ నారా॥ ౩౫

మ. ఒనరన్భక్తికిఁ ద్రోవపుణ్యములకుం బుట్టిల్లు మోక్షంబునం
దునికిస్థానము యిష్టభోగములకున్ సూత్పత్తియేపారెడున్
ఘనపాపంబులవైరి షడ్రిపులకున్ గాలావసానంబు మీ
యనుతాంఘ్రిద్వయపద్మసేవనగదా విశ్వేశ నారా॥ ౩౬

మ. భవరోగంబులమందు పాతకతమోబాలార్కబింబంబుక
ర్మవిషజ్వాలసుధా సువాతురతుషారవ్రాతపాథోధిమూ
ర్తి వివేకైవల్యధనావలోకనకళాదివ్యాంజనశ్రేష్ఠమై
భువిలో మీదగు మంత్రరాజమమరున్ భూమాత్మ నారా॥ ౩౭

మ. వరుసన్ గర్మపిపీలికాకృతి తనూవల్మీకనాళంబులోఁ
బరగంగావసియించియుండెడు మహాపాపోరగశ్రేణికిం

బరిమోచ్చాటనమై రహస్యమహిమం బాటింపుచున్నుండు నీ
తిరుమంత్రంబగు నంత్రినాజనమురుం దివ్యాత్మ నారా॥ ౩౮

మ. హరుఁడున్ బ్రహ్మాదిజనాంజనేయుఁడుని సుహృన్న యంబరీషున్ ధ్రువుం
గరిరాట్ప్రహ్లాదు విభీషణాఖ్యుని బలిన్ ఘంటాశ్రీపు నారదున్
గరిమెప్పన్విదురున్ బరాశరసుతున్ గాంగేయునిన్ ద్రౌపది
నరునక్రూరునిఁ బాయకుండుదువు భక్తవ్రాతమున్ నారా॥ ౩౯

మ. శ్రీకిన్మందిరమైన వక్షము సురశ్రేష్ఠ ద్ధ్వవస్థానమా
భీకంబాతము చంద్రికాంతరసుధాభివ్యక్తి నేత్రంబులున్
లోకస్తుత్యమరున్న దీజనితయా లోలాంఘ్రియున్ గల్గుచున్
లోకారాధ్యుఁడవైన నిన్నుఁ బసు నాలోకింతు నా॥ ౪౦

మ. విందుల్ విందులటంచు గోపరమణుల్ వేపల్లెలోఁ జన్నపా
నంబుల్ మ్రోయఁగ ముద్దువేణువుల నివ్వాళింపుచున్ సేయుచోఁ
దెంపంబుల్ పనివారి రాగరసకేళీలీలలన్ దేల్చు మీ
మందస్మేరము క్షేమగోచము మాకున్ స్మరింతుము నారా॥ ౪౧

మ. పొందుల్వచ్చిరి మీయశోదకడకున్ స్వేగం బెపో స్మృయ్యమో
నందానందన! చందనాంకురము! కృష్ణా! యింకఁ బోవేమి మా
మందంజాతరసేవ బోదమి దామ్యా మ్రయంచు మిమ్మెత్తునో
చందంబబ్బినమబ్బకుండుదురె గోపస్త్రీలు నారా॥ ౪౨

మ. అన్నా కృష్ణమనేఁడు వేలుపులకు మీ దన్నార మీచట్లలో
వెన్నల్ మట్టుపమున్న నాతకణమున నిల్వాకృతిన్మూర్తి పై
యున్నన్ దిక్కులు దాముమున్ దెగడి నోర్త్రిత్వన్నజల్ సేయుచున్
గన్నుల్ మూకముఖశోదనక్షిరుతమై కన్పింతు నారా॥ ౪౩

మ. ఉల్లోలంబులు గాఁగురుల్ నుదుటిపైనూపొంగ మోమెత్తి ధ
మ్మిల్లంబల్లఁగనాడ రాగరససమ్మిశ్రంబుగా నీవు వే
పల్లందాఁచుచు గోపగోనివహగోపస్త్రీలయుల్లంబు మీ
పిల్లంగ్రోవిని బట్టి రాదిగుచు నీ పెంపొప్పు నారా॥ ౪౪

మ. కసవొప్పం బసిమేసి పొద్దుగలుగం గాంతారముం బాసి
యప్పసియున్నవును వచ్చువో యెదురుగాఁ బైకొన్నగోపాంగనా
రసవద్వృత్తపయోధరద్వయహారిద్రాలేపనామోదముల్
పసిఁగొంచున్ బసిఁగొంచువచ్చుటలు నేభావింతు నారా॥ ౪౫

మ. చన్నుల్ మీఁదికి చాకలింపనడుముం జవ్వాడకందర్ప సం
పన్నాఖ్యంబునటింపఁజూడ్కి కబరీభారంబు లూటాడఁగా
విన్నాణంబున నొప్పు గోపికలు గోబృందంబుతో వచ్చు మీ
వన్నెల్ కన్నులమించి గ్రోలుటలు నే వర్ణింతు నారా॥ ౪౬

మ. పెరుగుల్ దచ్చుచు నొక్కగోపిక మిముం బ్రేమంబునం జూచి రా
గరసావేశత రిత్తపవ్వనిడియుం గవ్వంబు నీవున్మనో
హారలీల గనుఁగొంచు ధేనువనియాహ్యబోసనుం బట్టితీ
వరవృత్తాంతము లేను పుణ్యకథగా వర్ణింతు నారా॥ ౪౭

మ. కేలం గోలయు గూటిచిక్కము నొగిం గీలించి నెట్టంబుగాఁ
బీలీపింఛముఁ జుట్టి నెన్నడుమునం బింఛావలిన్ గట్టి క
ర్ణాలంకారకదంబగుచ్ఛమధుమత్తాలీస్వనం బొప్ప నీ
వాలన్ గాచినభావమిట్టిదని నేవర్ణింతు నారా॥ ౪౮

మ. కాళిందీతటభూమి నాలకదుపుల్ గాలూది మేయంగ సము
త్తాలాలోలతమాలపాదపశిఖాంతస్థుండవై వేణురం
ధ్రాళిన్ రాగరసంబు నింప విలసద్రాగంబు సంధించి గో
పాలవ్రాతము గంతు గోయిలలుగా వర్ణింతు నారా॥ ౪౯

మ. రాణింపెంగనుమంచు నీసహచరుల్ రాగిల్లి సోలంగ మీ
వేణుక్వాణము వీనులం బడి మనోవీథుల్ బయల్ ముట్టఁగా
ఘోణాగ్రంబులు మీఁది కెత్తుకొని లాంగూలంబు లల్లార్చు గో
శ్రేణుల్ చిందులు ద్రొక్కియాడుటలు నే వర్ణింతు నారా॥ ౫౦

మ. పసులం గాపఁదయేమి చెలుఁగు నధరపాత్రియోల్ల సద్వృత్త వా
గ్విసరారావము మోవి దావెదురుగోవిందబెట్టి నాదంబు నిం

# నారాయణశతకము.

గసరుల్ దోఁపఁగ నాఁడుగోపికల తద్గానంబులన్ మన్మథ
వ్యసనాసక్తులఁజేయుచందములు నే వర్ణింతు నారా॥ ౫౧

మ. జడియెంతో దడవయ్యెఁ జెయ్యియలసెన్ శైలంబుమా చేతులం
దిఁకుమన్నన్ జిరునవ్వుతో నదలినన్ హీనోక్తిఁ గేల్పెట్టనె
క్కుఁడుగోవుల్ బ్రియమందరిందుఁబసులం గోవర్ధనాద్రిం దయన్
గొడుగై యుండఁగఁ గేలఁబూనితిగదా గోవింద నారా॥ ౫౨

మ. లలితాకుంచితవేణియందుననివిమొల్లల్ జాజుల్ఫాలస్థలిన్
దిలకంబొప్పలరంగఁ గుండలరుచుల్ దీపింపఁగాఁ జెక్కులన్
మొలకన్నవ్వుల చూపులొరగిల మేన్మువ్వంకలన్ బోవఁగా
నలిఁగైకొందువుగాదె నీవు మురళీనాట్యంబు నారా॥ ౫౩

మ. మాపాలం గనుగొన్నివ్వి గోపికలలో మన్నించి వర్తింతువే
మాపాలంబులెవచ్చి యుండుదు వెసన్మాపాలలోనుండుమీ
మాపాలైన సుఖాత్మ పీవెయనుచో మన్నించితా గొల్లలన్
మాపాలంగలవేల్పు వీవెయని కామన్నింతు నారా॥ ౫౪

మ. ఒకకాంతామణికొక్కఁడీవు మరియున్నొక్కర్తె కొక్కండవై
సకలస్త్రీలకు సంతసంబలర రాసక్రీడ సన్మధ్యక
ల్పకమూలంబున వేణునాదరసముప్పంగాఁ బదార్వేలగో
పికలం జెంది వినోదమొందు నెడ నీ పెంపొప్పు నారా॥ ౫౫

మ. లలితంబైన భవత్తనూవిలసనన్ లావణ్యదివ్యామృతం
బులఁగుల్కాడఁ గటాక్షవుష్పములుగా నందండ గోపాంగనల్
తలపుల్పాదులుగట్టి కందళితనూత్నస్త్రీలు వాటింతురా
నెలతల్ తీవెలుచైతొ విస్ఫురణవల్ నీయొప్పు నారా॥ ౫౬

మ. లీలన్ బూతకి ప్రాణవాయువులు పాలిండ్లందు వెళ్ళించి దు
శ్శీలుండైచను బండిదానవు వెసం జెండాడి పడందన్ని యా
గోలన్మద్దులుగూల్చి ధేనుదనుజున్ గోఁజంగ గీల్గించి వే
మూలం గంసునిఁగొట్టి గోపికలకోర్కుల్ దీర్తు నారా॥ ౫౭

మ. రసనాగ్రంబున నీదునామరుచియున్ రమ్యంబుగాఁ జెల్వున్
వసలారంగ భవత్కథాభిరతియున్ హస్తాబ్జయుగ్మంబులన్
వెస నీపాదసుపూజితాదియుగముల్ విజ్ఞానమధ్యాత్మకున్
వెస నింపొందనివాఁడు దాఁబశువుసూ వేదాత్మ నారా॥ ౫౮

మ. వరదుగ్ధాబ్ధి తరంగ డోలికలలో వైకుంఠలోకంబులో
వరవొప్పార నయోధ్యలో మధురలో వ్రేపల్లెలో ద్వారకా
పురిలో నాడెడుభంగి నాదుమదిలో భూరిప్రసన్నాననం
బురహంబొప్ప నటించుమట్టొప్పను సీతాంభోజాక్ష నారా॥ ౫౯

మ. చల్లత్వేఁజూకయూర నన్నుఁ గొని నాసంబోవుచోఁ బ్రోవ నీ
వుల్లాసంబున నడ్డకట్టి యుడినోద్యోగానులాపంబులన్
చల్లన్ జల్లనిమాపు జల్లుమని గోపస్త్రీలపైఁ జల్లు మీ
చల్లంబోయి తెరంగు చిత్తమున నే జర్చింతు నారా॥ ౬౦

మ. కలయ న్వేదములున్ బురాణములు విఖ్యాతంబుగాఁ దెల్సి మీ
వలనం భక్తివిహీనుఁడైన విదపన్ వ్యర్థప్రయత్నంబె పోఁ
గులకాంతామణి గొడ్డుపోయినగతిం గొవ్వారు సస్యంబు దా
ఫలకాలంబున నీచపోవు పగిదిన్ పద్మాక్ష నారా॥ ౬౧

మ. స్నానంబుల్ నదులందు జేయుట గజస్నానంబు చందంబునన్
మౌనంబొప్పఁ బఠించు వేదమటవీ మధ్యంబులో నేడ్పగున్
నానాహోమములెల్ల బూడిదలలో నర్పించు నెయ్యౌచను
నీనామోక్తియు నీపదాబ్జరతియున్ లేకున్న నారా॥ ౬౨

మ. ఇలనీటందగు గొంపిపైఁ జిలికిన న్నానీటనేపాయు నా
లలపాపంబుకి దుర్భరత్వంబు మహాహేయంబునం బొందినం
బలువై జీవుని దొప్పఁదోఁగినవి యీబాహ్యంబునం బాయునే
తొలియుంగాక భవత్సుపాదజలమ్ము నం బ్రోక్షింప నారా॥ ౬౩

మ. తనచిత్తాబ్జము మీపదాబ్జములకున్ తాత్పర్య సద్భక్తితం
తున బంధించిన బంధనంబుకతనం దుష్పాపపుంజంబు లె

మ. ఒరులం దన్నెఱుఁగ నయ్యొరుకయు న్నొప్పార నేకాంతమం
దరయం బైపడు నన్యభామినుల నాకాంక్షింప దూరత్వముల్
మరణావస్థను నీదునామములె సన్మానంబునందోఁచుటల్
ధరలోనన్నివి దుర్లభంబులు సుధాభామాక్ష నారా॥ ౭౧

మ. వెరవొప్పన్బహు శాస్త్రమర్మములొగి న్వీక్షించి వేతెల్సిమీ
వరనామామృత పూరమానుచుఁ దగన్ వైరాగ్యభావంబునన్
సరినశాంతముఁగోరువారు పిదపన్ సంసారమాతుః పయో
ధర దుగ్ధంబులు గ్రోలనేరరు వెసం దైత్యారి నారా॥ ౭౨

మ. వేదంబందు సునిశ్చయుండగు మహావేల్పెవ్వఁడో యంచు నా
వేదవ్యాసపరాశరుల్ వెదకుచు న్వేఱొండు లేఁడంచు మీ
పాదాంభోజము లెల్లప్రొద్దు మదిలోఁ భావింతు రత్యున్నతిన్
శ్రీదేవీ వదనారవింద మధుపా శ్రీరంగ నారా॥ ౭౩

మ. సుతదారా ప్తజనాది విత్తములపై శూన్యాభిలాషుండునై
యతనోద్రేకయుతంబులై పొదలునయ్యేయింద్రియవ్రాతముల్
ధృతిఁ బొందించి దమంబునన్ శమమునన్ మీరంగవర్తించు ని
ర్గతసంసారి భవత్కృపంబొరయు నోకంజాక్ష నారా॥ ౭౪

మ. ప్రమదంబారఁగ పుణ్యకాలగతులన్ భక్తిన్ననుష్ఠింపుమన్
నమరన్నన్న సువర్ణగోసలిల కన్యాధారుణీగ్రామదా
నములామ్నాయ విధోక్తి భూసురులకున్ సన్మార్గుఁడై యిచ్చువాఁ
డమరేంద్రాశ్రిత వైభవోన్నతుఁడగున్నామీఁద నారా॥ ౭౫

మ. ఇలనెవ్వారి మనంబులందెఱుకదా నెంతెంత గల్గుంను నా
కొలదిం జెంది వెలుంగుచుందువు వెసన్ గోవిందనీరూపులన్
యలర న్నంబుమితంబులై సరసిలోనంభోరుహంబుల్ దగన్
నిలనొప్పారెడు చందమొందెడుపుడున్నీలాంగ నారా॥ ౭౬

మ. మదిలోనందమభక్తి పీఠముపయిన్ మానాథమీపాదముల్
గదియం జేర్చినవానికే నొడయుఁడన్ గానంచు నత్యున్నతిన్

పదిలుండై సమవర్తి భృత్యుచెవిలో భారంబుగాఁ బల్కు మీ
పదపద్మార్చకు లెంతపుణ్యులో కృపాపారీణ నా॥ ౭౭

మ. కులమెన్నం గొలఁదేల యేకులజుఁడుం గోవిందాభిమానాఖిలా
వీలు న్నజ్ఞానముబాసి జ్ఞానము మదిన్ సంధించి శుద్ధాత్ముఁడై
యలరారం బరుసంబుసోఁకు నినుమున్ హేమాకృతిన్ సొమ్మమై
కలయున్నాకృతి వాఁడు ముక్తి కరుగుం గంజాక్ష నా॥ ౭౮

మ. నిరతానంద వియోగులై నిరసులై నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై కఠినులై కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై భగ్నాంగులై మర్త్యు వా
రరయం మిమ్మెఱుఁగని వాత్మ్రయం దిడనివా రబ్జాక్ష నా॥ ౭౯

మ. ఘనభోగాస్పదులై గతేనుమతులై కారుణ్యులై పుణ్యులై
ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మాత్ములై నిత్యులై
మనుజాధీశ్వరులై మనోజనిభులై మాన్యస్థులై స్వస్థులై
వనరన్నొప్పెడువారు నీపదతతుల్ వర్ణింప నా॥ ౮౦

మ. విదితామ్నాయ నికాయఘూతములలో విజ్ఞానసంపత్కళా
స్పదయోగీంద్ర మనస్సరోజములలో బ్రహ్మేంద్రదిక్పాలక
తి దశవ్రాత కిరీటరత్నములలో దీపించుచున్నట్టి మీ
పదపద్మంబులు భావగేహమున నే వర్ణింతు నా॥ ౮౧

మ. విలయన్ యౌవనకాలమందు మరుఁడున్ వృద్ధాప్యవేళఁ బలన్
బలురోగంబులు నంత్యమందు యముఁడుం బాధింపఁబట్టయిన యీ
పలుజన్మంబులు చాలమూరితి నన్నుం బాలింపవే దేవ మీ
ఫలితానంద దయావలోకనము నాపైఁజేర్చి నా॥ ౮౨

మ. బలుకర్మాయత పాశబంధవితతిన్ బాహోపరిశ్రేణికిం
జలయంత్రాన్వితబంధయాతనగతిన్ సంసారకూపంబులో
నలరం దిమ్మరుచుండు నన్ను నకటా! యార్తుండనై వేడెదన్
వెలయ న్నీకృపచేతఁ జేయుమనవి విశ్వేశ నా॥ ౮౩

మ. మమహంకారవికారసంపద మహామత్తాలిలో నంధకా
రము చే ముక్తికి నేగుమార్గ మెఱుఁగ రాదింక నాలోనికిన్
విమలాపాంగదయాదివాకరు వెసన్ వీక్షింపఁ గాఁ జేయుమీ
కమలానంద విహారవక్షు లలితా! కంజాక్ష. నా॥ ౮౪

మ. పరిపంథిక్రియ నెత్తి వెంటఁబడు నప్పాపాళికిం దూలి మీ
చరణాబ్జస్థితి పంజరంబు శరణేచ్ఛం జొచ్చితిం గావుమీ
బిరుదుం జూడుము మీరు నూడఁగ భవద్భృత్యుండు దుఃఖంబులం
బొరయన్ నీకపకీర్తి గాదె శరదంభోజాక్ష నా॥ ౮౫

మ. సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యంబునున్ శీలమున్
నతి శాంతత్వము చిత్తశుద్ధికరమున్ నధ్యాత్మయున్ ధ్యానమున్
ధృతియుం ధర్మము సర్వజీవహితముం దూరంబుగానుండ
సమ్మతికిం జేరువ మీనివాస సుఖమున్ మానాథ నా॥ ౮౬

మ. భవనాశిన్ గయతుంగభద్ర యమునన్ భాగీరథిం గృష్ణవే
త్రవతిన్నర్మద పెన్నబాహుదపయోరాశిన్ప్రయాగంగయా
దవగాహంబున నైన పుణ్యము లొగి న్నారంగ నేఁ డిచ్చుటన్
భవదంఘ్రి స్మరణంబునం గలుగు నోపద్మాక్ష నా॥ ౮౭

మ. ధర గ్రామాధిపు నింటిదాసుఁ డొరు కెంతో ద్రోహముం జేసినన్
పరగం జెల్లుట సూచితీ భువన సంపాద్యుండవై నట్టి మీ
వరదాసావలి దాసదాసినయి దుర్వారౌఘముల్ జేసితిన్
కరుణం జేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణ నా॥ ౮౮

మ. గణుతింపం బహుధర్మశాస్త్ర నిగమౌఘంబు చెప్పును న్నిన్నుకా
రణబంధుండను నత్తెఱంగు కడుదూరంబయ్యె నామానినం
బ్రాణతుల్ జేసెదఁగొంతయైన గణుతింపం బాటిలేకుండినన్
ఋణమా నానుతి నీవు శ్రీపతివి నీ కేలప్పు? నా॥ ౮౯

మ. కరినాథుండు జలగ్రహగ్రహణ దుఃఖాక్రాంతుఁడై యీశ మీ
శరణంబన్న కృపానుభావను శతతేజస్ఫూర్తిన్ యైనట్టి మీ

మ. అపరాధంబులు నిన్నునమ్మి వినమే నాజన్మపర్యంతముల్
విపరీతంబుగఁ జేసినాఁడఁ గనిక న్నీవేదిక్కు నాలోఁకిన్
గపటం బింతయు లేక దండధరునిం గట్టీక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడ నయ్య ధర్మపురిలక్ష్మీనాథ నా॥ ౯౭

మ. చెల్లం జేసితి పాతకంబులు మదిన్ శ్రీనాథ మీ నామముల్
పొల్లుల్ బోవని నమ్మినాఁడ సిరిక న్నాపాలిటన్ గృపామూర్తివై
చెల్లం బోనను నమ్మి వీఁడని దయం జేపట్టి రక్షింపుమీ
తల్లిందండ్రియు నీవు గాక యొరులే తర్కింప నా॥ ౯౮

మ. నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాళీక పత్రేక్షణభూ
ధర గోవింద ముకుంద కేశవ జగత్త్రాతాహి తల్పాంబుజో
దర దామోదర తార్క్ష్యవాహన మహాదైత్యారి వైకుంఠమం
దిర పీతాంబర భక్తవత్సల కృపం దీపింపు నా॥ ౯౯

మ. కడకంటం గడవేని సంపదలొగిం గావింపు లక్ష్మీశ పా
ల్కడలిన్ బన్నగశాయివై భువనముల్ గల్పించు సత్పుత్రునిన్.
బొడమంజేసిన నాభిపంకజ జగత్పూతాత్మ భాగీరథీ
పడతిం గన్న పదారవింద మిఁకనే భావింతు నా॥ ౧౦౦

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన నారాయణశతకంబున సర్వంబును సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.



